# స్టేజికి సూచనలు

నాటకాలు వేయడానికి ప్రతివూళ్లోను నాటకశాలలుండవు. కాబట్టి బహిరంగ ప్రదేశాలలో వేయవలసివుంటుంది. అందుకు స్టేజినిర్మాణాన్ని గురించి తెలుసుకోవడం అవసరం.

స్టేజిఎత్తు భూమినుండి 1½ అడుగులు ఉండాలి. బల్లలతోటిగాని వెదురు వాసాలతోగాని, మట్టితోగాని నిర్మించవచ్చు. వెడల్పు 15 అడుగులు, పొడవు తొమ్మిది అడుగులు, ఎత్తు 7½ అడుగులు. సైడుకర్టెన్లు ఒక్కొక్కటి 3 అడుగుల వెడల్పు చొప్పున 7½ అడుగుల యెత్తు ఉండాలి. శబ్దం హెచ్చుచేయడానికి నాలుగు కుండలు పందిరిమీద బోర్లించాలి. ముందు ప్రేక్షకులకు అవి కన్పించకూడదు.

తెరలు సీనరీతో అద్దెకుతేవడం కష్టం. తెచ్చినా ప్రతిదృశ్యానికి సరిపోయే తెరలు లభ్యంగావు. అందుచే ఆయా దృశ్యాలలోని ప్రధానభావాలను, రసాలను ద్యోతకం జేసేవిగా మాత్రమే రంగుల తెరలుండాలి.

ఉదా :—యుద్ధం, క్రోధం, వైరం: ఎర్రతెర; శాంతం; తెలుపు; శృంగారం ; గులాబీ; కల్యాణం; పసుపు; దుఃఖం, విచారం, కుట్ర; నలుపు.

## అ భి వం ద నా లు

ఈ నాటకంలో " కరువువచ్చి బెంగాల్ ప్రజ " " తిండిదొంగలా పర్రిజాశత్రువులు " "కాంగ్రెసులీగులుకలవాలీ " అను పాటలు కామ్రేడ్ కోగంటి గోపాలకృష్ణయ్యవి. " ప్రళయము పుట్టెను వంగదేశమున" అను పాట కామ్రేడ్ సుంకర సత్యనారాయణది. వీరిద్దరూ అడుగగానే మాకీ పాటల స్వీకారానికి అనుమతి నిచ్చి సహాయపడినందుకు వారికి మా అభివందనాలు.

# పాత్రలు

భవాని :— రిలీఫ్ వర్కర్. దుర్గాచరణుని అన్నకొడుకు. ప్రతిమకు అన్న. వయస్సు 26.

ప్రతిమ :— దుర్గాచరణుని కుమార్తె. భవానీతోకలసి పనిచేస్తుంది. వయస్సు 20.

ఉష :— ప్రతిమకు చెల్లెలు. కడుపుమండుతున్నా ప్రతిష్ఠకు పెనుగులాడి కష్టాలపాలైన అమాయకురాలు. వయస్సు 16.

దుర్గావరణ్ :— మధ్యతరగతి రైతు. వయస్సు 50.

రహీం :— భవానీతోకలసి పనిచేసే రిలీఫ్ వర్కరు. స్థానిక ముస్లింలీగు కార్యదర్శి. వయస్సు 30.

మనోరంజన్ :— కాంగ్రెసువాది. వయస్సు 45.

శ్యాందాస్ :— తిండిదొంగ. వయస్సు 40.

మధుబోస్ :— పంచమాంగదళానికి చెందినవాడు. వయస్సు 28.

వశీరంజన్ :— దళారి. శ్యాందాసును అంటిపెట్టుకుని యుంటాడు. వయస్సు 35.

చారుదత్తు :— ధనిక రైతుబిడ్డ. విలాసపురుషుడు. వయస్సు 22.

అప్పుడప్పుడు వలంటీర్లు వస్తారు.

# ప్రదర్శన సన్నాహం

## మొదటి అంకము

| రంగం | నటులు | తెర | వస్తువులు |
|---|---|---|---|
| 1 | ప్రతిమ, ఉష, దుర్గాచరణ్, వలంటీరు | నలుపు | మందుపొట్లం |
| 2 | శ్యామదాస్, మధుబోస్, నళినీరంజన్, భవాని, రహీం, వలంటీరు | నలుపు | తివాచి, పత్రి |
| 3 | శ్యామదాస్, నళినీరంజన్, మధుబోస్, దుర్గాచరణ్ | నలుపు | తివాచి |
| 4 | ప్రతిమ, నళినీరంజన్ | ఎరుపు | |

## రెండో అంకము

| రంగం | నటులు | తెర | వస్తువులు |
|---|---|---|---|
| 1 | చారుదత్తు, ప్రతిమ | ఎరుపు | రెండు కుర్చీ |
| 2 | ఉష, ప్రతిమ, శ్యామదాస్, భవాని | నలుపు | |
| 3 | శ్యామదాసు, నళిని, మధు | నలుపు | తివాచి |
| 4 | మనోరంజన్, భవాని, వలంటీరు | తెలుపు | చాప |
| 5 | శ్యామదాస్, మధుబోస్, మనోరంజన్, నళిని | నలుపు | తివాచి |

## మూడో అంకము

| రంగం | నటులు | తెర | వస్తువులు |
|---|---|---|---|
| 1 | ఉష, దుర్గావరణ్, వలంటీర్లు, ప్రజలు | నలుపు | |
| 2 | భవాని, ప్రతిమ, వలంటీరు | ఎరుపు | చాప |
| 3 | మధుబోస్, చారుదత్తు, నళినీరంజన్, ప్రతిమ, భవాని, వలంటీరు, ప్రజలు | ఎరుపు | |
| 4 | భవాని, ప్రతిమ, రహీం, మనోరంజన్ శ్యాందాస్, చారుదత్తు, నళినీరంజన్, వలంటీర్లు, ప్రజలు | నలుపు | చాప |

# ప్రారంభం

[నాటక ప్రారంభానికి ముందు ఒకరు జండాపుచ్చుకొని స్టేజీ మధ్యలో నిలబడి ఈ పాట పాడాలి. తక్కినవటులు సైడ్వులోనుండి పాటను అందుకోవాలి. జండా: ఎర్రజండాపై నక్షత్రమూ, ప్రజావిజ్ఞాన పరిచారమండలి అనే అక్షరాలుండాలి. పాట పాడినతర్వాత తెర పడు తుంది.]

పాట

(బ్యాండ్ మెట్టు—త్రితాళ్)

ప్రజాసేవయే మా జీవితాశయం
ప్రజల శక్తియే మా ఉక్కు కవచమూ
విజ్ఞానప్రచారమే మా ముఖ్య సూత్రమూ
హావ భావ నటనమే మా ముఖ్య సాధనం
శాంతి స్వాతంత్ర్యం
అభ్యుదయములూ
మా వెలుగు చుక్కలూ
మా జీవితాశయం

జై జై జై జై జై ॥

# ఒకటో అంకము

## ఒకటోరంగము

(దుర్గాచరణ్ ఇల్లు - ప్రతిమ పాడుతూ ప్రవేశిస్తుంది)

పాట

వంగపౌరుడా - లేరా ! రారా ! !
కరువుతొ దేశం - కాలనీకురా
కళాసీమ బెంగాలు - కరవుతో
స్మశానభూమిగ - మారుతోందిరా
విశ్వకుటుంబా - దేశమిచ్చినా
వంగకుటుంబమె - క్రుంగుతోందిరా ॥వం॥

(ఒక వలంటీరు వస్తాడు)

వలం :—(మందుపొట్లాం యిస్తూ) అమ్మగారికెలావుందండి ?

ప్రతిమ :—(అందుకొని) అలానేవుంది. అన్నయ్య వస్తానన్నాడు. రాలేదేం ?

వలం :—మీటింగుకు వెళ్లాడు.

ప్రతిమ :— మీటింగెక్కడ ?

వలం :—మేడదగ్గర.

ప్రతిమ :—ఏవిషయాన్నిగురించి ?

వలం :—ఆహారసమస్యనుగురించి.

ప్రతిమ :—మీటింగునుంచి రాగానే ఒక్కసారివచ్చి పొమ్మన్నావనిచెప్పు.

వలం :—వరేలెండి. (వెళ్తాడు)

ప్రతిమ :—ఉషా....

( ఉష వస్తుంది )

ఉష :—ఏమిటక్కయ్యా ?

ప్రతిమ :—అన్నయ్య మందుపంపించాడు - ఇదిగో - (పొట్లంయిస్తూ) తీసుకు పోయి అమ్మకుయివ్వు-

ఉష :—(పొట్లం అందుకొని) ఏం మందులే! ఒకటే మందులు పోస్తున్నాము. ఎన్ని మందులు పోసినా తగ్గటంలేదు. తిండిలేక చచ్చేదానికి మందులతో జబ్బు తగ్గుతుందా ?

ప్రతిమ :—మందువాడకంగూడా లేకపోతే యెలా బ్రతుకుతుందే ?

ఉష :—ఎలాగో బ్రతుకుతుంది. యే జన్మన యేం చేసుకున్నామోగాని అనుభ విస్తున్నాము. ఎన్నాళ్ళనిలా వస్తుఉండాలి ? అంతా అయోమయంగా వుంది.

ప్రతిమ :—ఏజన్మనో చేసుకోవడమేమిటి ? ఈజన్మనే చేసుకున్నాం. కరువువస్తుం దనీ భవానన్నయ్య నాన్న కెన్నోవిధాల చెప్పాడు. ఆనాడు నాన్న గ్రహిం చాడా? ధాన్యం అమ్మవద్దనీ పదిరూపాయిలు అదనంగా కళ్ళబడేసరికి ధాన్యం అంతా అమ్మకూర్చున్నాడు. మరో నెలనుంచి ధాన్యంధర అంతులేకుండా పెరిగి పోయింది. జ్ఞాపకంలేదూ ? అనుభవించటంలా. ఆకలితో పేగులు మాడిపోతున్నాయి.

(దుర్గాచరణ్ వస్తాడు. ఉష వెళ్ళిపోతుంది)

దుర్గా :—భవాని, భవాని : వాడు వట్టిబటాచోరు. వాడికేం ? వెనకాముందూనా అనేవాళ్ళు వున్నట్టయితే కనపడేది వాడి బ్రతుకు. చిన్ననాడే తండ్రి చచ్చాడు. కరువు వస్తూనే తల్లిని వదలించుకున్నాడు.

ప్రతిమ :—నాన్నా ! అన్నయ్యను అనవసరంగా తిడుతున్నావు. తల్లి బ్రతికున్నం తకాలం పూజించాడు. జబ్బుతో మంచంలో అవస్థపడుచున్నప్పుడు యెంతో సేవజేశాడు. ముసలిపండయి రాలిపోయింది.

దుర్గా : —(కోపంగా) నువ్వు వాడిమీద అభిమానం చంపుకోవాలి. వాడిసంగతి నాకుతెలుసు. తల్లి జబ్బుతో మంచంపట్టి వుంటే, వీడేమో వీధుల్లో తిరుగు తుండేవాడు. ప్రజాసేవట. ప్రజా సేవ.

ప్రతిమ :—వీధుల్లో అనవసరంగా తిరిగేవాడుకాదు. తల్లికి మందిచ్చేవాడు. ఆమెను వేయికండ్లతో కనిపెట్టుండేవాడు. ఆమె కోరిందల్లా తెచ్చిచ్చాడు. ఆమెలా బాధపడ్తున్న వాళ్ళకు సహాయం చేశాడు. ఎంతో బాధ్యతతో తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు. అంతకంటే ఇంకేమి చెయ్యాలి.

దుర్గా :—(విసురుగా) ఏదో చెయ్యాలి. ఎందుకూ నువ్వు వాడిసంగతి నాదగ్గఱ యెత్తవద్దు. వాడిమూలంగా మనవంశ పరువు ప్రతిష్ఠలు నాశనమైనాయి. మాల మాదిగలతో వాడిస్నేహం-ఛీ, ఛీ! మహమ్మదీయులతో సహకారం. ఇదేనా ప్రజాసేవ. దీనితోనే కరువు పోతుందా?

ప్రతిమ :—అవును. ధాన్యం దాచినవారిని తెలుసుకోవాలన్నా, తిండిని బయటకు లాగాలన్నా, ప్రజలందరూ కలవాలి. అదే ప్రయత్నంచేస్తున్నాడు.

దుర్గా :—పీడిమొఖం చేస్తున్నాడు. ఒక్కకుటుంబంలోని నలుగుర్ని కలపలేడుగాని దేశాన్ని, దేశాన్ని కలుపుతాడట. చదివి సంపాదించటం చేతగాక ఇదొకటి దొరికింది.

ప్రతిమ :—ఆనాడు నళినీరంజన్ మాటలు విన్నావు. ధాన్యంఅంతా అమ్మావు. అందుకు ఫలితంగా పొలం, ఇల్లు, పశువులు, నగలు వొకటేమిటి వున్నవన్నీ అమ్మేశావు. పరువు, ప్రతిష్ఠలనే పేరుతో మా నోళ్ళుకట్టావు. ఆ స్తంతా పోయింది. పరపతిపుట్టడంలేదు. రోజు, రోజుకు జీవించడం కష్టంగా తోస్తూంది. అమ్మ మంచంలో అలమటిస్తూంది. వీటన్నింటికి అన్నయ్యేనా కారణం? కాదు - కాదు. అన్నయ్యమాట వింటే మనకీగతి పట్టేదేకాదు.

దుర్గా :—నేనిలా వస్తుందనుకున్నానా? అప్పులవాళ్ళొచ్చి యింటిమీద పడితే; అమ్మాను. అప్పులు తీర్చాను. యింతలో కరువొచ్చింది. వున్నదంతా పోయింది. కాని కాలం. యేంచేస్తాం? మంచిరోజులు రాకుండాపోతాయా?

ప్రతిమ :—వస్తాయి. మంచిరోజులొస్తాయి. యిప్పటికింతవరకొచ్చాయి. ఇంకా భవానన్నయ్య చెప్పింది వినకపోతే యింతకన్నా మంచిరోజులువస్తాయి.

దుర్గా :—ఇంతబ్రతుకూ బ్రతికి చివరకు వాడు చెప్పిందే వినాలి? ఎన్నడూ జరగదు. తిండిలేకపోతే దేశాలుపట్టన్నా పోతాగాని వాడుచెప్పింది వినను. మాకుటుంబగౌరవానికి కళంకంతేను.

(ఉష ప్రవేశము)

ఉష :—అమ్మ ఆకలంటోందే.

ప్రతిమ :—కొంచెం మంచినీళ్ళివ్వమ్మా. (ఉష వెళ్ళుతుంది.) నాన్నా! అమ్మ జ్వరంతోకాదు బాధపడుతూంది; ఆకలితో.

దుర్గా :—(ఆదుర్దాగా) భవాని యేమన్నాడు ?

ప్రతిమ :—యిప్పుడు మన దేశంలో వచ్చేరోగాలన్నీ తిండిలేకేనన్నాడు.

దుర్గా :—వాతలానేచెప్తాడు. తిండిలేకపోతే రోగాలొస్తయ్యా ? అయినా పళిపి రంజన్ యెక్కడో అప్పిప్పిస్తాన్నాడు. యిప్పుడే వస్తాను. (ఆలోచనతో వెళ్ళిపోతాడు. ప్రతిమ విచారంగా నిలబడివుంటుంది.)

— తెర —

(తెరలో)

పాట

విశ్వకుటుంబా దేశమిచ్చినా
వంగకుటుంబమె క్రుంగుతోందిరా
వంగపౌరుడా లేరా రారా
కరువుతో దేశం కాలనీకురా.

# రెండోరంగము

(ప్రదేశం : శ్యామదాస్ భవనం. మధ్యగదిలో తివాచీపరచి వుంటుంది. శ్యామదాస్ కూర్చొని పత్రిక చదువుతుంటాడు. మధుబోస్ వస్తాడు.)

మధు :—నమస్తే సేట్ జీ.

శ్యామ :—(తలెత్తి) ఓహో. హో ! నమస్తే. నమస్తే. అలా కూర్చోండి.

మధు :—(కూర్చొని) ఏదో దీర్ఘంగా చదువుతున్నారే ?

శ్యామ :—చదువుతున్నాను. ఈరోజుల్లో వ్యాపారంచేయడం ప్రమాదం గాదండీ !

మధు :—అవును కష్టంగాదుమరీ ! అప్పులడగడం. యివ్వకపోతే అల్లరి చేయడం. అందులో ప్రత్యేకంగా భవాని అరితేరాడుగా.

శ్యామ :—చూడండి. ఇప్పటికి వూరిమీద లక్షరూపాయిలు పెట్టాను. ఒకే వొక్కడికైనా అభిమానం వుందా ? నాలుగుమాటలు చెప్పగానే ఆ భవాని వెంటే వెళ్తారు.

మధు :—మీదగ్గర ధాన్యం తీసుకునేది, మిమ్మల్నే ప్రజాద్రోహులని నిందించేది. తిండిదొంగలని తూలనాడేది. ప్రభుత్వం మిలటరీకోసం ధాన్యాన్నికొని దాచేస్తే ఆమాటలు చెప్పడం యిష్టంలేక యీ ప్రభుత్వపు ఏజంటు 'తిండి దొంగలు, తిండి దొంగ' లని తెగఅరుస్తున్నాడు.

శ్యామ :—అసలు వాడెప్పుడూ అంతే. ధాన్యంఅంతా కంట్రోలుధరకు ప్రభుత్వమే కొని విలువచెయ్యాలని వాదిస్తాడు. కరువు పరిష్కారానికి అదే మార్గం అంటాడు.

మధు :—ఎలా పరిష్కారమవుతుందండీ? అసలు యుద్ధానికిపూర్వం మామూలుగా మనకు పండేధాన్యం చాలక బర్మానుంచి, సయాంనుంచి తెప్పించుకునేవాళ్ళం. ఈ యుద్ధంవస్తూనే ఆ సరఫరా ఆగిపోయింది. పైగా ఒక్క ఇండియా మిలిటరీచాలక ఆస్ట్రేలియావాళ్లు, అమెరికావాళ్ళు, చైనావాళ్ళు, ఇంగ్లీషువాళ్ల అంతాకలసి తినేస్తుంటే కరువురాక, కాటకంరాక, యేమౌతుంది? అసలు మనబోసు చెప్పనేచెప్పాడు. యిదంతా ప్రజావిప్లవం అభివృద్ధిపొంది బ్రిటిష్‌ప్రభుత్వం పతనం కావడానికి వచ్చిందని.

శ్యామ :—నిజమే!

మధు :—ఇలాంటి కరువులు యింకారావాలి. ప్రభుత్వంమీద ప్రజలకు అసంతృప్తి పెరగాలి. అప్పుడుగాని ప్రభుత్వం పతనంగాదు. దేశభక్తుడైన ప్రతివాడు యీ పరిస్థితులను వుపయోగించుకోవాలి. అశాంతిని రెచ్చగొట్టాలి.

(నళినీరంజన్ వస్తాడు)

నళినీ :—శ్యామదాస్‌గారు! మీతో మాట్లాడాలని భవాని, రహీంలు వచ్చారు.

శ్యామ :—నాతో మాట్లాడాలని వచ్చారా? (ఆలోచనతో) ఏమిటబ్బా మాట్లాడేది? సరే. రమ్మను.

మధు :—ఏం మాట్లాడుతాడు. మీవద్దున్న ధాన్యం యివ్వండి ప్రజలకు పంచేస్తామంటాడు.

శ్యామ :—(చికాకుగా) ధాన్యం యెక్కడుందని పంచుతాడు? రానీలే చూద్దాం (నళినీవైపు చూస్తూ) వెళ్ళు. వెంటనే రమ్మను. (నళిని వెళ్తాడు.)

మధు :—వాడితో జాగ్రతగా మాట్లాడాలి. ఎంతమాత్రం అవకాశం యివ్వకూడదు.

శ్యామ :—నాదగ్గరా వాడిఆటలు సాగేది? రానీ చూస్తావుగా?

మధు :—అదిగాదు. వాడెంతో దీనంగా చెప్తాదు. ప్రజలఅవసరం గుర్తించమంటాడు. ఎన్నెన్నో ఎత్తులువేస్తాడు. ఎంతకూ వినకపోతే ప్రజాశక్తినిచూపి బెదిరిస్తాడు. అదుగో వస్తున్నాడు. (నళినీ. భవాని; రహీంలు వస్తారు.)

శ్యామ :—రాండి. అలా కూర్చోండి. క్షేమంగా వున్నారా ?

భవాని :—క్షేమంగానే వున్నాము. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలనివచ్చాము.

శ్యామ :—మంచిదే నాయనా. ఆఁ ఆఁ అడుగమరచాను. మీ పిన్ని కెలావుంది?

భవాని :—అలానేవుంది. మనగ్రామంలో యింటింటా మలేరియా వ్యాపించింది.

నళినీ : —రైతుసంఘం మాదిరిగానే।

మధు :—(పకపకా నవ్వుతాడు)

రహీం : —(కోపంగా) నవ్వుగానేవుంటుంది. ప్రజల ప్రాణాలపై వేటాడే వాళ్లకు నవ్వుగానే వుంటుంది. నవ్వండి. నవ్వండి. నవ్వుకు ప్రతిఫలం త్వరలోనే పొందుతారు.

మధు : —ఏయ్! పిచ్చిపిచ్చిగా మాట్లాడబోకు. ఎవరనుకున్నావు. జాగ్రత.

శ్యామ :—అనవసరంగా తగాదాలుపడకండి. ఆగండి. ఆగండి. వచ్చిన పనేదో చెప్పండి.

భవాని : – మీవద్దవున్న ధాన్యాన్ని ఆహార కమిటీకమ్మాలి.

శ్యామ :—నావద్ద ధాన్యమా ? ఎవరు చెప్పారు ?

భవాని :—మాకెలాగో తెలిసింది. మీవద్ద ధాన్యంవుంది. ఆకలితో, అంటురోగాలతో అవినీతిపాలైపోతున్న ప్రజలకింత గంజిపోయండి.

శ్యామ : —లేదు. లేదు. నావద్దధాన్యం ఒక్క గింజైనాలేదు. నేనేంచెయ్యగలను? ఈ కరువునుండి బెంగాలును రక్షించటానికి ఆభగవంతుదే వున్నాడు ?

భవాని :—ఆరవైయేళ్ళనుండి ప్రజల స్వాతంత్ర్యంకోసం, అనేక త్యాగాలనుచేశాం. ఆప్రజలను. ఆజాతిని సజీవంగా వుంచాల్సినబాధ్యత నేడు మనమీదేవుంది. ఈకరువునుండి ప్రజల్ని రక్షించడానికి మీరు సహాయంచేయాలి.

మధు :—కాంగ్రెసు ఆశయం అన్నసత్రాలు పెట్టడంకాదు. ముస్లింలీగుఆశయం అంతకన్నాకాదు. కాంగ్రెసు ఆశయం స్వాతంత్ర్యం। లీగుఆశయం పాకిస్థాన్. కరువు కమిటీ పేరుతో భవాని చెప్పేదంతా గందరగోళం.

రహీం : —మీయిష్టం వచ్చినట్టు మాట్లాడకండి. కరువుతో కుటుంబాలకుటుంబాలు నాశనమౌతున్నాయ్. మన ప్రజల్ని మనమే రక్షించుకోవాలి. దేశాన్ని కరువుకు, అరాజకానికి గురిచేయడంకాదు దేశభక్తి.

శ్యామ :—చాలు చాలు! ఇకనాపండి. అన్నీవిన్నాను. నాచేతనైనదేమో యిది వరకే చేశాను. ఇక నేనేం చెయ్యలేను.

భవాని :—మీరు చుట్టుపట్ల గ్రామాల్లో కొన్న ధాన్యమంతా యేంచేశారు? అంతా అప్పుడే అమ్మేశారా?

శ్యామ్ :—కొన్నాను. అప్పుడే మారకం చేశాను. నాకుటుంబానికే చాటునా మాటునా వందలుపోసి ధాన్యం యేబస్తీనుంచో తెచ్చుకుంటున్నాను.

భవాని :—అయితే నిత్యం నళినీరంజన్ అమ్ముతున్న ధాన్యం యెక్కడిది?

నళినీ :—ఔనౌను అమ్ముతున్నాను. నా యెస్టేటులోనే పండింది.

భవాని :—ఎన్డేట్లకోసమే యిదంతా చేస్తున్నావు. తగిన శాస్తి త్వరలోనేవుంది.

శ్యామ :—దేశభక్తునిటర్ఫు నీలో కనుపించటంలా! చాలా వుద్రేకపడుతున్నావు.

భవాని :—దేశభక్తునిటర్ఫు దేశద్రోహి దగ్గరకాదు.

శ్యామ :—మా దేశభక్తినే శంకిస్తున్నావా? మా దేశభక్తిని నీవు గుర్తించ నవసరం లేదు. మాకు తెలుసులే!

భవాని :—మీకు తెలిసే సమయంకూడా ఒకనాడు వస్తుందిలే! (రహీంతో) ఎన్నిమార్లో ప్రయత్నించిచూచాం. ఇక లాభంలేదు. పోదాంపద.

[ముందుకురాగానే తెరపడుతుంది]

— మరో దృశ్యం —

(వలంటీరు ఆదుర్దాగా ప్రవేశిస్తారు)

వలం :—దొరికింది! ధాన్యం దొరికింది!!

భవాని :—ఎక్కడ? — ఎప్పుడు? —

వలం :—ఇప్పుడే! ఊరివెలుపలే ఆటకాయించాం. ధాన్యం బండ్లమీదనే వుంది. వలంటీర్సు కాపలావున్నారు.

భవాని :—ఎవరిదో తెలిసికొన్నారా?

వలం :—శ్యామదాస్‌దేనట!

భవాని :—అయితే పదండి. వెంటనే స్వాధీనం చేసుకోవాలి. (అందరూ త్వర త్వరగా నడుస్తారు.)

— తెర —

( తెరలో )

పా ట

వదునదూ! బెంగాల్‌వీరుడా!
వడుంకట్టి నీ దేశసేవకు!
తిండిదొంగలను తెగనరకాలి,
ప్రజల తిండిని రక్షించాలి! ॥ వదునదూ ॥

## మూడోరంగము

(శ్యామదాస్ భవనం: నళినీరంజన్ దీనంగా నిలబడివుంటాడు. శ్యామదాస్ కోపంగా వస్తాడు.)

శ్యామ :—(చికాకుగా) ఇదంతా నీలోనేవుంది. భవానికి భయపడి గుట్టంతా బయట పెట్టావు.

నళినీ :—(భయంతో) నాకేమీ తెలియదండీ!

శ్యామ :—తెలియదు. తెలియాదు. నీవు చెప్పకుండానే భవాని తెలుసుకొన్నాడేం?

నళినీ : —(విచారంగా) నన్ను నమ్మండి. ప్రజలు నిందించినా మిమ్మల్ని నమ్మాను. మీరే దిక్కనుకొన్నాను. మీఅండచూచుకొనే బ్రతుకుతున్నాను.

(మధుబోసు వస్తాడు.)

మధు :—చూచారా? నేను ముందుగానే చెప్పాను. భవాని చాల అసాధ్యుడని యిప్పుడైనా తెలిసిందా?

శ్యామ :—నళినీ! నిజంచెప్పావా యీసారికి నిన్ను వదిలివేస్తాను. ఒప్పుకో! చేసినతప్పు ఒప్పుకో!

మధు :— పాపం! వీడికేంతెలీదు. వలంటీర్లు కాపలాకాని పట్టుకొన్నారు. బళ్ళ వాళ్ళు ధాన్యం అప్పగించి తప్పుకొన్నారు.

శ్యామ :—మీకెలా తెలిసింది?

మధు :—పడమటివీధిలో అందరూ చెప్పుకొంటున్నారు.

శ్యామ :—ధాన్యం యిప్పుడెక్కడుంది?

మధు :—కరువుక్యాంపులో ఎవరిధాన్యమో చెబితే కంట్రోలురేటుకు ఇప్పిస్తామని బోర్డు కట్టారట.

శ్యామ :—అయితే యేంచేద్దాం ?

మధు :—ఏంచేస్తాం ? వదిలివెయ్యాల్సిందే! ధాన్యం మనదనిపోయామా కేసు వస్తుంది.

శ్యామ :—(కోపంగా) కేసు! కేసు!! కంట్రోలుపేరుతో అడ్డమైనగాడిదా వ్యాపారాన్నద్దేవాడే! కానీ చూస్తాను. ఒక్కగింజ ధాన్యంకూడా దొరక్కుండాచేస్తాను. మిడతల్లా మాడిచస్తారు. ఒరే నళినీ! ఇకముందు జాగ్రత్తగా వుంటావుగదూ ?

నళినీ :—(వినయంగా) ఉంటా. నన్ను నమ్మండి.

మధు :—నిన్ను నమ్మడానికేం ? నమ్మకమే. కాని నీవు యికముందు వెయ్యి కళ్ళతో కనిపెట్టివుండాలి.

శ్యామ :—ఇకనెన్నడూ రహస్యం బయటకుపోరాదు. తెలిసిందా ?

నళినీ :—నాద్వారా రహస్యం యెప్పుడూ బయటికిపోదు.

మధు :—ఇదంతా భవాని చేస్తున్నమోసం. వాడికి తగిన శాస్తిచెయ్యాలి.

(దుర్గాచరణ్ వస్తాడు.)

దుర్గా :—(నమస్కరిస్తూ) శ్యామబాబుగారూ! నమస్తే.

శ్యామ :—ఏదో పనిమీద వచ్చినట్టున్నారే ?

నళినీ :—భవాని పంపాడేమో ?

దుర్గా :—భవాని! భవాని! వాడితో నాకేంపని ? వాడు పంపితే రావడమేమిటి ?

శ్యామ :—ఏపనీ లేకపోతే వాడిదగ్గరే మందెందుకిప్పిస్తున్నావ్.

దుర్గా :—వాడుకాదు యిస్తున్నది. కరువు సహాయకసంఘంవాళ్ళు యిస్తున్నారు.

శ్యామ :—అలాగా! ఇప్పుడు యేంపనిమీద వచ్చావ్ ?

దుర్గా :—ఏం చెప్పను ? ఎంతో గౌరవంగా బ్రతికాను.

శ్యామ :—ఎవరు కాదన్నారు ?

నళినీ :—అనకుండావుంటారా అని.

దుర్గా :—ఇప్పుడు యేంతో హీనంగా బ్రతుకుతున్నాను. నా యింట్లో నలుగురికి పెట్టినవాణ్ణి. ఎన్నడూ పొరిగింటికి వెళ్ళినపాపాన పోలేదు.

శ్యామ :—అయితే ఇప్పుడీ స్వస్తిఅంతా యెందుకు ?

దుర్గా :—స్వస్తికాదు, నా అవస్థ. భార్య తీవ్రమైనజ్వరంతో వుంది. బిడ్డలిద్దరూ తిండిలేక మాడిపోతున్నారు. పదిరోజుల్నించీ ఒక్కపొద్దే తింటున్నారు. ఎంతో గారాబంగా పెంచాను. నేటికీదుర్గతి పట్టింది. నా సర్వస్వం మీ స్వాధీనమే అయింది. ఈ సమయంలో మీకన్నా నాకు సహాయంచేసే వాళ్ళెవ్వరూ లేరు.

శ్యామ :—ఇంతకూ ధాన్యం కావాలంటావ్. అంతేగా !

దుర్గా :—అవును. అందుకే వచ్చాను.

శ్యామ :—దీనికింత సోదెందుకు ?

దుర్గా :—నేనింతవరకెవ్వరికీ ఒక్క కానీ యెగవేసినవాణ్ణి కాదు. కాని కాలం వచ్చింది. ఇలావచ్చాను. మిమ్మల్నాశ్రయిస్తున్నాను. మీమీదనే నా ఆశ లన్నీ నిండుకొన్నాయి.

శ్యామ :—అవును. మంచిదే ! నీదగ్గర యేంచూసి నమ్మను ? ఇల్లా, వాకిలా ?

దుర్గా :—నామాట నమ్మండి. మాటపొరబాటు మనిషినికాను. ప్రాణంపోయినా మాట తప్పను.

నళినీ :—అయితే మాటలు కలకత్తాలో కొంటున్నారట.

దుర్గా :—చిన్ననాటనుంచీ నన్నెరుగుదురు. నన్నిమాత్రం నమ్మండి. పదిరోజుల్నించీ బిడ్డలిద్దరూ ఆకలితో కృశించిపోతున్నారు. వాళ్ళను చూస్తూంటే కడుపు తరుక్కుపోతుంది. వాళ్ళతల్లి చావుమంచంమీద అన్నంకోసం పలవరిస్తోంది. ఉత్తచేతుల్తో పోయి వాళ్ళముఖా లెలాచూడను. చూడలేను. వాళ్ళయెదుటికి పోలేను. బాబూ ! దయదల్చండి. సహాయం చేయండి.

శ్యామ :—ఇక్కడ దయ, ధర్మాలేంలేవు. భవాని సత్రంపెట్టాడుగా. అక్కడికి వెళ్ళి అతన్నే ఆశ్రయించు.

దుర్గా :— నేను వాడిదగ్గరికి పోను. మీరు కనికరించకపోతే దేశాలపాలౌతాను కాని ఆతనివద్దకుపోను. ఎన్నటికీ పోను.

నళినీ :—దేశాలపాలౌతావ్ ? వెర్రి ! పాపం ! ఆపిల్లల అదృష్టమన్నా బాగుంటుందేమో !

శ్యామ :—ఇప్పుడు నేనేం చెయ్యలేను. ఇంట్లో వుండనిస్తున్నానుగా ! అందుకు సంతోషించు.

దుర్గా :—మిమ్మల్ని నమ్మాను. నా పొలం, యిల్లూ, పశువులూ, నగలూ మీరు చెప్పినట్లు అమ్మాను. ఏ జవాబుదారీ నాదని యెన్నిమాటలో చెప్పారు. ఈనాడిలా అంటున్నారు. కొంచెం దయవుంచండి. పిల్లలుగలవాణ్ణి.

నళినీ :—ఈరోజుల్లో ఆడపిల్లలున్నవాళ్లకు కరువేమీలేదే!

దుర్గా :—నా అవస్థలన్నిటికీ కారణం నీవే. శ్యామదాసుగారూ! దయచూడరూ? సహాయం చేయరూ?

శ్యామ :— అనవసరంగా వేధించకు. వెళ్ళమని యిందాకనే చెప్పాను.

దుర్గా :—మీకు హృదయంలేదు. నా సర్వస్వం కాజేశారు.

నళినీ :—అపరకర్ణుడివి! అన్నీ వుచితంగానే యిచ్చావుగా!

దుర్గా :—మా అమ్మాయి యెంతచెప్పినా వినక ఉచ్చుల్లోపడ్డాను. లాభంవస్తుంది వస్తుందని నమ్మించావు. అంతా నిజమనుకొన్నాను. నమ్మాను. మోసపోయాను. అనుభవిస్తున్నాను.

శ్యామ :—అమ్ముకొన్నావ్. అవసరం తీర్చుకొన్నావ్. ఒక్క రాగిదమ్మిడీ అస్తి కూడ ఊరికే యివ్వలేదు.

దుర్గా :—దగాచేశావ్. పదిబస్తాలధాన్యం యిచ్చావు. అన్నీ వ్రాయించుకొన్నావు. దగా! అంతాదగా!! మోసం! పచ్చిమోసం!! కసాయితనం!

శ్యామ :—నీకేమైనా పిచ్చెత్తిందా యేమిటి?

నళినీ :—మొదటనే కరువుశ్యాంపులకు తోలాల్సింది! ఇన్నాళ్ళు ధాన్యంయిచ్చిన ఫలితంగాబోలు! ఏమేమో వాగుతున్నావు.

దుర్గా :—నీ దగారికూతలు అపు! ఇక నోరెత్తావంటే సహించలేను.

(శ్యామదాస్ నెట్టివెయ్యమని సైగచేస్తాడు.)

నళినీ :—సహించలేకపోతే సాగండి.

(భుజం పట్టుకొని నెట్టుతాడు.)

దుర్గా :—అగవోయ్! అగు! బాబూ! శ్యామబాబూ! ఇంతేనా? (నళిని నెట్టుతూంటాడు.) ఇంతేనా? ఇం....తే....నా....(బయటకు నెట్టివెయ్యబడతాడు.)

శ్యామ :—వీడి తాతముల్లెఅంతా దాచిపెట్టినట్లు వచ్చాడు. నమ్మాలట! నన్నాని! ఏంచూసి?

మధు :—అమాయకుడు వాడితోయేమిటి? అసలు భవానివిషయమే ఆలోచించాలి.

శ్యామ :—వాడా ? భవానిగారు ! వాడివిషయం తప్పక ఆలోచించాలి.
శశి :—నా వుద్దేశంకూడ అదే !
మధు :—తప్పకుండా తగినశాస్త్రి చెయ్యాలి.
శ్యామ :—అవసరమైన సహాయమంతా చేస్తాను. ఆ ప్రయత్నంలోనే వుండండి.
మధు :—అలానే. పోయివస్తాను. (వెళ్తాడు)

(శ్యామదాసు లోపలికి పోతాడు)

— తెర —

## నాలుగోరంగం

(దుర్గాచరణ్ యిల్లు. ఆవరణలో ప్రతిమ కూర్చొని ఆలోచనతో చికాకు పడుతూంటుంది. తెరలో పాట.)

కరువువచ్చి బెంగాల్ ప్రజ కాలుచున్నారూ
అస్సాములో అన్నములేక యున్నారు
లేకయున్నారు — అన్నములేక యున్నారు
కేరళలో, ఒరిస్సాలో కడుపుమంటతో
చిటగాంగులో తిండిలేక చింతతో—బాబు—నేడు —అయ్యో ॥కరు॥
తినగతిండి కట్టబట్ట లేక తిరుగుచూ
నిలువ నీడలేక ప్రజలు పలవరించిరీ
పసిపిల్లలు పాలులేక నేలకొరిగిరీ
కుటుంబాలు కూడులేక కుమిలిచచ్చిరీ —అయ్యో ॥కరు॥
ఎంగిలియాకులకు కుక్క యెగిరి దూకియూ
పిల్లవాని కఱచిలాగె కుక్కమెతుకులా—మెక్కెగతుకుచూ
దుక్కిఎద్దు, పాడిబఱ్ఱె బక్కచిక్కిపోయ్
మేతలేక డొక్కఎండి గోతగూలినాయ్
బెంగాలును రక్షించుట భారతభూమిన్
కాపాడుటగా తలచీ కదలుముబాబూ
పావలా బేడో తవ్వెడో మానెడు బియ్యం
చేయుము బెంగాల్ ప్రజలకు సాయముబాబు
సాయముబాబూ వేగమె చేయుముబాబు బాబు-నేడు-అయ్యో ॥కరు॥

ప్రతిమ :—నిన్నెప్పుడో పోయిన నాన్నింకారాలేదు. మా పస్తుల జీవితం చూడ లేక పోయాడేమో— అపును ఎంతకాలం అనుభవిస్తాడు— భరించలేదు —అందుకనే రాకుండాపోయాడు—ఇక రాడనుకుంటాను. అమ్మ. ఉషా యీ విషయం వింటే ఎంతగా ఏడుస్తారో ।

(ప్రవేశం నళినీరంజన్)

నళినీ :—మీ నాన్నగారింటికి రాలేదూ ?

ప్రతిమ:—(లేచి విచారంగా) ఇంతవఱకూ రాలేదు.

నళినీ:—నిజంగా రాలేదా ? పాపం । మిమ్మల్నీస్థితిలో విడచి ఎక్కడికివెళ్ళాడో ।

ప్రతిమ :— ఎక్కడికో వెళ్ళాడు. ఆవిషయం నీకెందుకూ? నీసానుభూతేం అవ సరంలేదు. మాకీ గతిపట్టించింది నీవుకాదూ ?

నళినీ :—అందులో నాతప్పేముందమ్మా – వ్యాపారరీత్యా సలహా యిచ్చాను. పరిస్థితులు తారుమారయినాయి. ఒక్క మీకుటుంబమేకాదు. మన బెంగా లంతా కరువుతో కాలిపోతూంది. ఇదంతా నేనేచేశానా ?

ప్రతిమ :—నీలాంటివాళ్ళే చేశారు.

నళినీ:—కానీ— అనండి— జరిగిందాన్ని మరచిపోండి. ప్రస్తుతం యింట్లో ధాన్యం లేదుగా । వస్తూంటే చారుదత్తు అనే అబ్బాయి మిమ్మల్నిగురించి ఎంతో యిదిగా అడిగాడు. జమీందారుబిడ్డ. ఆయన అనుకుంటే మీ కుటుంబాన్ని పోషించగలడు. నిస్సహాస్థితిలోవున్న మీకు ఆయనెంతైనా సహాయం చేయగలడు. చెప్పిచూస్తాను.

ప్రతిమ : — చాల్లే. అన్నీచేస్తావు. చేసిన అనుభవం ఉందిగా.

నళినీ :—నేనేంచేశాను తల్లీ. మీరూ నాబిడ్డల్లాంటి వారే. మీకన్యాయం చేస్తానా ? నన్నునమ్మండి. అతనికిచెప్పి తప్పకుండా సహాయం చేయిస్తాను.

ప్రతిమ :—చేసినప్పుడు చూద్దాంలే.

నళినీ :—చేయిస్తానుగా. అతన్నడిగి యీ సాయంకాలమే సహాయం చేయిస్తా నుగా. వస్తాను. తప్పకుండా సాయంకాలంలోపలే వస్తాను (వెళ్తాడు.)

(లోపల్నుంచి ఉష ప్రతిమను పిలుస్తుంది. ప్రతిమపోతుంది.)

— తెర —

# రెండో అంకము

## ఒకటోరంగము

(చారుదత్తు భవనం. ముందుగదిలో చారుదత్తు, ప్రతిమ చెరో కుర్చీలో కూర్చొనుంటారు.)

ప్రతిమ :—మాఅమ్మ తీవ్రమయిన జ్వరంలోవుంది. త్వరగా పంపించండి.

చారుదత్తు : —పంపిస్తాను. త్వరగానే వెళ్దూగాని. పాపం! మీనాయన మిమ్మల్ని మీ అదృష్టానికి విడిచిపోయాడు. ఇక కుటుంబభారంఅంతా నీమీదనే పడుతుందికావాలి. ఎలా సర్దుకుపోతావో

ప్రతిమ :—మా నాయన త్వరలోనేవస్తాడు. వొస్తూనే మీబాకీ తీర్చుకుంటాము.

చారుదత్తు :—మీనాయన మళ్ళీవస్తాడా? రాడు—రాడు. కరువుతో కుటుంబం విడిచి పోయినవాళ్ళు ఇంతవరకెవరూ తిరిగిరాలా. వస్తాడనేఆశ పెట్టుకోకు.

ప్రతిమ : —ఏమో! మీమాటలు నేను నమ్మలేకపోతున్నాను వస్తాడు. మానాన్న తప్పకుండావస్తాడు.

చారుదత్తు :—నాకు నమ్మకంలేదు. అయినా యీ సంసారాన్నీదవలసిన భారం నీదేగా; అందుకే విచారిస్తున్నాను.

ప్రతిమ :—నన్ను త్వరగా పంపించండి. ఒక్క క్షణంకూడా మాఅమ్మని విడిచి దూరంగా ఉంటానికి వీల్లేదు. వెళ్ళాలి. త్వరగావెళ్ళాలి. పంపించండి.

చారుదత్తు :—అలా త్వరపడతావేం. ఏంకావాలో చెప్పూ; మనిషిద్వారా పంపిస్తాను. నీవు నెమ్మదిగా వెళ్దువుగాని.

ప్రతిమ :—అమ్మ చాల అవస్థలోవుంది. నేను వెంటనే వెళ్ళాలి.

చారుదత్తు : —ఉష ఉందిగా. నీవొక గంటలో వెళ్దూగాని. ఏం పంపమంటావో చెప్పూ?

ప్రతిమ :—మీరేమీ పంపొద్దు. నాచేతికే యివ్వండి ఒకొందరూపాయలు. మా నాన్న వస్తూనే తీర్చుకుంటాము.

చారుదత్తు :—చాలా అమాయకంగా మాట్లాడుతున్నావు. ప్రతిమా ! నిన్నుచూసే అప్పిస్తానంటున్నాను. మీ నాన్నపై నమ్మకంతోకాదు.

ప్రతిమ :—అంటే ?

చారుదత్తు :—అంటేనా ! ఏముంది? నీవు సుఖపడాల్సిన వ్యక్తివి. కాని దుఃఖాల్లో మునిగిపోతున్నావు. సహజంగావున్న నీ అందంఅంతా వృధాఅవుతోంది.

ప్రతిమ :—మీమాటలు నాకర్థం కావటంలేదు. విశ్వాసంతో, నమ్మకంతో, యివ్వాలంటే యివ్వండి; మళ్ళీ తీర్చుకుంటాము.

చారుదత్తు :—అదిగాదు ప్రతిమా ! నువ్వు యిస్తేమాత్రం తీసుకుంటానా ? నిన్ను నాహృదయంలో చిత్రించుకున్నాను. నీమూర్తిని పూజిస్తున్నాను. నీగురించి నేనెంతో ఆలోచిస్తున్నాను. నీ సుఖానికి నే చేయగలదంతా చేస్తాను. నా సంతోషానికి—

ప్రతిమ ;—వద్దు. మీ సహాయంవద్దు. (అని లేస్తుంది)

చారుదత్తు :—(లేచి ప్రతిమ కెదురుగా నిలబడి) అలాఅనకు ప్రతిమా ! చక్కని గులాబిపువ్వులాంటి నీ శరీరం ఆకలిజ్వాలల్లో మాడిపోతూంది. నీ అందం వ్యర్థమయిపోతూంది.

ప్రతిమ :—మీరేమ్మాట్లాడుతున్నారో నా కర్థం కావడంలేదు; ఆపండి.

చారుదత్తు :—అర్థం కావడంలా ? నీలో పొంగివస్తున్న యవ్వనంవుంది. పరుగులెత్తుతున్న తీరని కోరికలున్నాయి. నిర్మలమయిన హృదయంవుంది. నీవు బీదపిల్లవనే అభిప్రాయంతో అన్నింటికీ దూరంగా ఉంటున్నావు. అయినా నీ సౌందర్యం నన్నాకర్షించింది.

ప్రతిమ :—మా కుటుంబంమీద మీకేదో అభిమానం ఉందనుకున్నాను. వాసిరంజన్ నమ్మించాడు. మోసంచేశాడు. నేనెంతో ఆశతోవచ్చాను. నాఆశలన్నీ నిరాశలయ్యేయి. వినరానిమాటలు వింటున్నాను.

చారుదత్తు :—నన్నేం చేయమంటావు? చావుకు సిద్ధంగావున్న నీతల్లి బాధ్యతతీసుకుంటాను. ఉషను పోషిస్తాను. మీ కుటుంబాన్నన్నివిధాలా కాపాడతాను. మీకెన్నో సుఖాలు కల్పిస్తాను. నాదొక్కటే కోర్కెవుంది.

ప్రతిమ :—మీరు మా పేదరికాన్నవకాశంగా తీసుకొని మాట్లాడుతున్నారు. మీరిలా మాట్లాడుతారంటే వచ్చిఉండేదాన్నికాదు. క్షమించాలి. (పోతోంది.)

చారుదత్తు :—కాదు—ప్రతిమా ! కాదు అగు—ఒక్కక్షణం ఆగు. నాకు మీ కుటుంబంమీద ఎంతో గౌరవంవుంది. మిమ్మల్ని దయతో చూస్తాను—

ప్రతిమ ;—మీరు దయకాదు చూపిస్తూంది. దుర్మార్గం చేయబోతున్నారు. ధన మదాంధులై అభిమానాన్ని అమ్మమంటున్నారు. ధాన్యం దాచారు. కరువు తెచ్చారు. జాతిని, కామాగ్నికి ఆహుతి కమ్మంటున్నారు. ఇది మానవత్వం కాదు.

చారుదత్తు :—ప్రతిమా ! నీ కర్థం కావడంలా, కావాలని నీవొక భయంకర నరకంలో దూకబోతున్నావు. చూడు. నేడో రేపో నీతల్లి మరణిస్తుంది శ్యామదాను యిల్లు ఖాళీ చేయిస్తాడు. దిక్కులేకుండా దేశాలపాలౌతారు.

ప్రతిమ : — ఏమైనా అవుతాము. ఆవిషయంతో నీకు సంబంధంలేదు.

చారుదత్తు :—విను ప్రతిమా ! విను, నామాట విను. చేతులారా సుఖాన్ని దూరం చేసుకోకు. (చేయి పట్టుకుంటాడు.)

ప్రతిమ :—వదులు వదులు — వదులు ! (చేయి విదిలించుకోబోతుంది చారుదత్తు గట్టిగా పట్టుకుంటాడు. ప్రతిమ పెనగులాడుతు ది. చారుదత్తు చేయివదలడు. ఉద్రేకంతో చెంపపైకొడుతుంది. చారుదత్తు నిప్పెరపోతాడు. ప్రతిమ త్వరగా వెళ్లిపోతుంది.)

తెర

# రెండోరంగము

(దుర్గాచరణ్ ఇల్లు. ప్రవేశం ప్రతిమ, ఉష)

(తెరలో పాట)

ఆకలి ! ఆకలి ! మందేఆకలి !
నరములన్నిటిని నమలేఆకలి !

నీతి నియమముల జాతి భేదముల
పాటించొద్దనే బండఆకలి !

మానవత్వమును మరపించేసి
దోపిడికొరకై తోలేఆకలి !

కాళరాత్రి లోకాలన్నిటినీ
గాలింపించే కటికిఆకలి !
అభిమానాన్నీ ఆశయాలనీ
సహనశక్తినీ చంపేఆకలి !
ప్రపంచమంతా భ్రమరూపంబని
విలపించే యావెఱ్ఱిఆకలి !
నిరాశతోడ వైరాగ్యాన్ని
కలిగిస్తుందీ కాళేఆకలి !

ఉష :—అక్కా ! ఎందుకే అలా విచారంగాఉన్నావు ? నిన్నుచూస్తే నాకెంతో భయంగావుంది. బ్రతుకే అయోమయంగావుంది. ముందెలా గడుస్తుందో ?

ప్రతిమ :—తల తిరిగిపోతూంది. ఏమి చెయ్యడానికి పాలుపోవడంలేదు. భవానన్నయ్య రాలేదు రాగానే అడుగుదాం.

ఉష :—అన్నయ్య మొన్ననే చెప్పాడు. నాకా కరువుక్యాంపుకు రావడం ఇష్టంలేదు. అలగాజనంతో కలసి ముద్దకోసం ఎగబడలేను.

ప్రతిమ :—ఏదోవొకటి చేద్దుగానిలే; రానియ్యి.

ఉష :—క్యాంపుకు పోవడం నీకిష్టమేగా ? అమ్మఅడ్డు కాస్తాపోతే భవానితో కలిసి పోతావు. కాని నాకాపని ఇష్టంలేదు. ఫలానివాళ్ళ అమ్మాయి ముష్టితిండికి వచ్చిందంటే నాతల తీసినట్లుగా వుంటుంది. కరువు క్యాంపుకు నేరాను.

ప్రతిమ :—ఎవరక్కడ చూడమ్మా !

ఉష :—(లేచి చూస్తుంది) శ్యాందాసే.

(ప్రతిమకూడా లేస్తుంది. శ్యాందాసు వస్తాడు)

శ్యాం :—అమ్మాయి ! మీ అమ్మకు చాలాజబ్బుగా వుందటగా. పాపం ! చిన్నపిల్లలు. (ప్రతిమ, ఉష విచారంగా చూస్తారు.) విచారించి లాభమేముందమ్మా ? ఆ భగవంతుడు కష్టాలమీద కష్టాలు తెచ్చిపెడతాడు. ఏంచేస్తాం ? కర్మను తప్పించుకోగలమా. (ఆలోచించి) అన్నట్లు మరచిపోయాను. కలకత్తానుంచి రేపోమాపో మావాళ్లొస్తామని కబురుచేశారు. మీరేదైనా ఇల్లు చూసుకుని ఖాళీచేయాలి.

ఉష :—ఈ యిల్లు ఖాళీచేయాలా ?

శాం :—అవునమ్మా. ఔను. చెప్పడానికి నాకే నోరు రావడంలేదు. ఏంచేసేది? గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు మీకన్నీ అవస్థలే వచ్చాయి!

ప్రతిమ :—కానీయండి. ఏంచేస్తాం? త్వరలోనే ఖాళీచేస్తాంలెండి.

శ్యాం :—మంచిదమ్మా మంచిది. కాస్త త్వరలో ఖాళీచేయించండి. (వెళ్తాడు.)

ఉష :—అక్కా! చావుకు సిద్ధంగానున్న అమ్మతో ఇల్లెలా ఖాళీచేస్తామే? ఎక్కడికి పోతామే?

ప్రతిమ :—వెళ్ళక తప్పుతుందా.

ఉష :—నాకేం అర్థంకావడంలేదు. అంతా అయోమయంగావుంది.

(ప్రవేశం భవాని)

భవాని :—ఎందుకే అలావున్నారు?

ఉష :—ఇంట్లోనుంచి వెళ్లిపోవాలంటున్నయ్యా.

భవాని :—ఎవరన్నారు?

ప్రతిమ :—శ్యాందాసు.

భవాని :—అలానా! సరేలే—అమ్మ కెలావుంది? ఇద్దరు ఇక్కడే కూర్చున్నారేం? పదండి. పోదాం పదండి. (ముగ్గురూ లోపలికి వెళ్తారు.)

— తెర —

## మూడో రంగం

(శ్యామ్‌దాస్ భవనం - మధుబోసు ఆలోచిస్తూ తిరుగుతుంటాడు. శ్యామదాసు నళినీరంజన్ వస్తారు)

శ్యామ్ :—మధుబోసుగారూ! మీరాలస్యం చేసినకొద్దీ వాడు బలపడుతున్నాడు.

నళినీ :—హద్దూపద్దూలేకుండా పోతున్నాడు.

మధు :—వాడిమొఖం పోతాడు. జపాన్నుంచి మనబోసుబాబు వస్తున్నాడుగా. అప్పుడే చిటగాంగుపై తీవ్రమైన దాడి ప్రారంభం అయింది. ఇంకేం ఏడుస్తాడు. తిండికోసం ప్రజలల్లాడిపోతున్నారు. వంట్లో శక్తంతా వుడిగిపోతూంది. నైతికబలం తగ్గిపోతూంది. ప్రభుత్వంపై ప్రజలకు తీవ్రమైన

అవంతృప్తి పెరిగింది. బోసుబాబు సైన్యం వస్తూనే స్వాగతం యిస్తారు. తప్పకుండా వీడి తిక్కకుదురుతుంది.

శ్యామ్ :—లేదు—లేదు. ప్రజలెంతమాడుతున్నా దేశాన్ని రక్షించుకోవాలని తిండి దొంగల్ని బయటపెట్టాలనీ బలంగా ప్రచారంచేస్తున్నారు. నానాటికీ వారి శక్తి పెరుగుతూంది. నిన్నమొన్నటి వరకూ వ్యతిరేకంగా పనిచేసిన కాంగ్రెసువారు సైతం వాళ్ళతో చేతులు కలుపుతున్నారు. అందులోవాడు రాత్రింబగళ్లూ నిద్రాహారాలు లేకుండా కృషిచేస్తున్నాడు. వాడంటే అందరికీ సానుభూతుంది.

మధు :—లేదు—లేదు. వాడిపై అణుమాత్రం కూడా సానుభూతిలేదు. ఎంతో కాలంనుంచీ కాంగ్రెసులో పనిచేస్తున్న మనోరంజన్ కూడా అతన్నంతు లేకుండా ద్వేషిస్తున్నాడు. అతన్నికూడా కలుపుకుందాం.

శ్యామ్ :—నిజంగానా ! అతనుకూడా మనతో కలుస్తాడా ? భవానీపై కక్షసాధిస్తాడా ?

మధు :—అవునవును ! తప్పకుండా కలుస్తాడు. ఇప్పుడే వెళ్లి మాట్లాడివస్తాను.

(తెరలో పాట. "దూర్ హటో" మాదిరి)

ప్రజాశత్రువులౌ తిండిదొంగలను బయటకు నెట్టగ రారండోయ్
లేలెండోయ్, రారండోయ్—
హిందూముస్లిం లందరు ఒకటై విజయసాధనకు కదలండోయ్
తల్లీపిల్లలు ఎడబాటయ్యా, భార్యాభర్తలు దూరంబయ్యి
ఏబదిలక్షల బెంగాల్‌వాసులు ఏటికి కాటికి జేరుటకు
నరపిశాచులౌ తిండిదొంగల స్వార్థమె కారణమౌనండోయ్ ॥లే॥

ధరలు పెంచి లాభాలను తీయ కరువుసమస్య అధికంబాయె
ధాన్యందాచే తిండిదొంగలకు తగినశిక్షను వేయండోయ్
ఉన్నధాన్యమును ఉమ్మడిగానే ఉంచీ ప్రజలకు పంచండోయ్ ॥లే॥

అధికలాభముల నరికట్టంగా, ఆహారకమిటీల నెలకొల్పంగా
ప్రజలందరునూ ఏకోన్ముఖులై విజయముచాటీ చూపండోయ్
దేశాన్ని రక్షించండోయ్ స్వాతంత్ర్యం సాధించండోయ్ ॥లే॥

శ్యామ్ :—విన్నావు మధూ! విన్నావ్. వాదల్లరంతులేకుండా పెరిగిపోతూంది. ధాన్యం దాచామట. కరువు తెచ్చామట. తెచ్చిన ఆ ప్రభుత్వాన్ని సాధించ లేక, మనపై బడేడుస్తున్నాడు.

మధు :—ఇంకెన్నాళ్ళేడుస్తాడు. త్వరలోనే ఫలితం పొందబోతున్నాడు. చూస్తా రుగా! వస్తాను. మళ్ళీత్వరలో కలుసుకుంటాను. (వెళ్తాడు)

— తెర —

## నాల్గోరంగము

(మనోరంజన్ యిల్లు. మనోరంజన్, భవానీ కూర్చునుంటారు)

భవాని :—గ్రామంలోని ధాన్యమంతా శ్యామదాస్ దాచాడు. ఎన్నో కుటుంబాల ఆస్తిపాస్తుల్ని తాకట్టు పెట్టించుకుని. పూర్తిగా వ్రాయించుకుని దిక్కులేని వాళ్ళను చేశాడు. ఎన్నివిధాల ప్రయత్నించినా లాభంలేకుండా వుంది. అతన్ని బలపరుస్తూ మధుబోస్ తిరుగుతున్నాడు. వూరంతా ఒకటే కాకి గోలగావుంది.

మనో :—అయితే యేంచేదాం! నాకేం పాలుపోవడంలా.

భవాని :—దాచిన ధాన్యాన్ని బైటకు తీయిద్దాం. ప్రజలకు తిండిపెడదాం.

మనో :—మొన్నమొన్ననే శ్యామ్‌దాస్ ధాన్యం పట్టుకున్నారటగా. అతనొక్కచే విధంగా నావద్దకొచ్చి మొత్తుకున్నాడు. మీతో అతను బ్రతికేవిధంగాలేదట.

భవాని :—అనాదత సింటికెళ్ళి వివయంగా అడిగాను. కరువుతో రోగాలతో ప్రజ లెలా అవస్థపడుతున్నారో చూడమన్నాను. ఎన్నిచెప్పినా వినిపించుకోలా. పైగా నిందించాడు.

మనో :—కాదటగా. అతన్నే బెదిరించారట. నీకు త్వరలోనే తగినశాస్తి వున్న దన్నారట.

భవాని :—ధాన్యం దాచి లేదంటున్నావు. నిజం బైటపడుతుంది. అనాడే ప్రజలు తగినశాస్తి చేస్తారన్నాం.

మనో :—అతనివద్ద ధాన్యంలేదట. నిష్కారణంగా ప్రజల్ని అతనిపైకి రెచ్చ గొడ్తున్నారట. అలాచేయడం మంచిదికాదు. కరువువచ్చి ధాన్యం దొర క్కండాపోతే అతనేంచేస్తాడు?

భవాని :—శ్యాందాస్‌లాంటివాళ్లు ధాన్యందాస్తేనే కరువువచ్చింది. ఈనాడతనివద్దున్న ధాన్యంఅంతా బైటకుతీస్తే గ్రామానికంతటికీ సరిపోతూంది. అపని చేయడాని కత డంగీకరించడంలా. అతనిచేతాపని చేయించుటకే ఈప్రయత్నమంతా.

మనో :—దౌర్జన్యంగా అతనిచేతాపని చేయిస్తారా ?

భవాని :—అలా యెప్పటికీ చెయ్యం. ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే విక్రయించ మని అడుగుతాం. అతనలాచేయ నిరాకరిస్తే దాచినధాన్యం ఎక్కడుందీ గాలించి బైటకుతీస్తాం—గ్రామప్రజల ఆకలి చల్లార్చుతాం.

మనో :—అలా ఎన్నటికీ చేయలేరు. ధాన్యం ఎక్కడవుందని వెదుకుతారు. మీ ప్రయత్నాలన్నీ వ్యర్థం అవుతాయి.

భవాని :—కావు. వ్యర్థం ఎన్నటికీకావు. ఏమూల ధాన్యందాచినా, ఎన్నాటంకాలున్నా బయటికితీస్తాం. అదే ప్రజలను బ్రతికించుకునేమార్గం.

మనో :—ఎంతకాలం యిలాచేస్తారు ? ఈ నిరంకుశప్రభుత్వ మున్నంతవరకూ యింకా కరువులు హెచ్చుతూనేవుంటాయి. జాతీయప్రభుత్వం రానంత కాలం ప్రజాసానుభూతి రాదు. యీసమస్యను పరిష్కరించలేం.

భవాని :—ప్రభుత్వంపై కోపంతో, మనప్రజల్ని రక్షించుకోకుండా ఎలా చేతులు ముడుచుక్కూర్చోగలం. కూర్చోలేం. కరువుతో నాశనమవుతూన్న కుటుంబాల్ని కాపాడకుండా వుండలేం. మనం పూని పనిచేయకపోతే చచ్చేది మన ప్రజలే. అందుకనే దాచినధాన్యాన్ని బయటికితియ్యాలి. ప్రజల ప్రాణాలు రక్షించాలి. శ్యాందాస్‌దగ్గర ధాన్యంనిల్వవుంది. దాన్ని బయటకు తీస్తే అందరిప్రాణాలు రక్షించబడుతాయి.

మనో :—అతనివద్ద ధాన్యం వుందనేనమ్మకం నాకేమాత్రం లేదు. అనవసరంగా మీరతన్ని సాధించజూస్తున్నారు.

భవాని :—ధాన్యందాచి అతనే ప్రజల్ని సాధిస్తున్నాడు. ఒక్క మనగ్రామానికే గాకుండా, చుట్టుపట్ల అయిదారుగ్రామాల ధాన్యంకొని నిల్వచేశాడు. అందరి ఆస్తులూ అతని భుక్తంలోకే వచ్చాయి. కుటుంబాలకు కుటుంబాలు దేశాల పాలయ్యాయి. అతనికి దయా దాక్షిణ్యాలులేవు. చూడండి. మనగ్రామంలో దుర్గాచరణ్ కుటుంబాన్నీ, చిత్తప్రసాద్ కుటుంబాన్నీ, శశిబాబు కుటుంబాన్నీ దిక్కులేనివాళ్లనుగా చేశాడు. ఇవిగాకండా యింకాఎన్నో పేద కుటుంబాల్ని పొట్టనుబెట్టుకున్నాడు. కళకళలాడే గ్రామంఅంతా కళాహీనంగా తయారైంది. చూస్తూచూస్తూ ఎలా వూరుకుంటాం. అంతాపోయాక మనం సాధించే స్వాతంత్ర్యం ఎవరిని అనుభవించమందాం ?

(వలంటీరు త్వరగా వస్తాడు)

వలం :—మీ పిన్నమ్మగారికి చాలా ప్రమాదంగావుందిట. ప్రతిమ ఆఫీసుకువచ్చి త్వరగా పంపమని చెప్పిపోయింది.

మనో ;—పాపం ! వాళ్ళ సంసారికెన్నో కష్టాలొచ్చాయి. పోయిరా.

భవాని :—ఆలోచించండి. పోయివస్తాను.

(విచారంగా పోతుంటాడు. వలంటీరు అనుసరిస్తాడు)

— తెర —

# ఐదోరంగము

(శ్యాందాస్ ఇల్లు. శ్యాందాస్, మధుబోస్, మనోరంజన్ తివాచీపైకూర్చునుంటారు)

శ్యాందాస్ :—భవాని నన్ని గ్రామంలో బ్రతుకనిచ్చేలాలేదు. ధాన్యంవిల్వ చేశా నసీ; ఎందరిభూములో్న వ్రాయించుకున్నానసీ అల్లరిచేస్తున్నాడు.

మధు :—ఇదే దేశభక్తని అమాయక ప్రజందరీ్న నమ్మించాడు. కదిత్తే ప్రజల్ని వెంటేసుకు బయలుదేరుతాడు. ఒకటేగోలగావుంది.

మనో :—నావద్దకూ్కడావచ్చి చెప్పిపోతూనేవున్నాడు. అన్నీ వింటున్నాను. జరుగులోందంతా చూస్తున్నాను.

శ్యాం : —మీసహాయంలేకపోతే నన్ని గ్రామంలో వుండనివ్వడు. తప్పకండా మీరు నాకు సహాయం చెయ్యాలి.

మధు ;—అతను ప్రభుత్వంతో కల్సిపొయ్యాడు. జాతీయ పోరాటానికి వ్యతిరే కంగా పనిచేస్తున్నాడు. దేశద్రోహి అయిన భవాన్నిసాధించడానికి మనతో తప్పకండా కలుస్తాడు.

మనో :—భవానితో కల్సిపోలేదు. కాని అతను రాత్రింబగళ్లు ఆహారసమస్యా పరిష్కారానికి నిద్రాహారాలు లేకండా పనిచేస్తున్నాడు. ప్రజల్లో అతని కెంతో సానుభూతివుంది. అతన్ని మనమేంసాధిస్తాం?

మధు :—మీఅండవుంటే ఆపని స్వయంగా నేనే చేస్తాను.

శ్యామ్ : —భవాన్నిసాధించడానికి మధు చాలాకాలంనుంచీ ప్రయత్నిస్తున్నాడు. మీ సహాయం వుంటే తప్పకండా చేస్తాడు.

మనో :—అతన్నేంచేస్తారు ? నా సహాయం మీకేం వుపయోగిస్తుంది ?

మధు :—యేదైనా చేస్తాను.

శ్యామ్ :—మనపని కాటంకం లేకుండా చేస్తాడు.

మనో :—(ఆలోచనతో) యేం చేస్తారో నాకేమీ బోధపడటంలా.

(నలినీరంజన్ వస్తాడు)

నళినీ :—దుర్గాచరణ్ భార్య పోయింది. ఉష కనుపించడంలేదట. అంతా గోలగా చెప్పుకుంటున్నారు.

మధు :—భవానీ తిక్కొదిలిందిలే. ఈదెబ్బతో హడితల తిరిగిపోతుంది.

శ్యామ్ :—దైవంలేడూ ! సన్నన్నవాళ్ళకు బాగానే ప్రతీకారం జరిగింది.

మనో :—పాపం ! వాళ్ళకుటుంబం ఎంత గౌరవంగానో బ్రతికింది. అయ్యయ్యో ! కరువుకారణంగా యేదశకు పోతున్నాయి కుటుంబాలు ! !

మధు :—వాళ్ళకుటుంబం అలా కావల్సిందే. భవాని మనస్సుకు శాంతిలేకుండా పోవల్సిందే. మన స్వాతంత్ర్యపోరాటానికి మార్గం సులువుగావల్సిందే. అందుకు విచారించాల్సిన అవుసరం యేంవుంది ?

మనో :—ఈ విషయంలో మీతో నేనేకీభవించలేను. అతని రాజకీయాలకూ నాకూ వ్యత్యాసంపుంది. అయినా కరువుతో బాధపడుతున్న ప్రజలకు ఎంతో సేవ జేశాడు. అతన్ని జూచా విషయంలో మనమంతా సిగ్గుపడాలి.

మధు :—ఆ ! ఆ ! అలా మాట్లాడుతున్నారేమిటి ? మీనుంచి యిలాంటిమాటలు వస్తాయని నేనెన్నడూ వూహించలా.

శ్యామ్ :—జాలిహృదయం. చావుకబురు వింటూనే విచారంలో మాట్లాడినమాటలు గాని. భవానిమీద విరోధం పోయిగాదు.

మనో :—నాకు భవానిమీద విరోధంలేదు. హృదయపూర్వకంగా సానుభూతివుంది.

మధు :—మీపై ఎంతోఆశపెట్టుకున్నాం. మేం ఎన్నడూ అనుకోనిరీతిగా మాట్లాడుతున్నారేం ?

శ్యామ్ :—మా ఆశలన్నీ నిరాశలు చేస్తున్నారు.

మనో :—మీరు మీపని చేసుకోవచ్చు. (బయలుదేరుతాడు)

శ్యామ్ :—మనోరంజన్‌గారూ! వుండండి. ఒక్క క్షణం ఆగండి. ఆలోచించండి. మీకుకూడా మాపై కోపంవస్తే మేమెవర్నాశ్రయించం? ఎవరి అండతో ఈ గ్రామంలో వుండం?

మనో :—నామనస్సంతా చికాకుగావుంది. నన్ను వెళ్ళనీయండి. నేనీసమయంలో మీకేమీ సహాయం చెయ్యలేను.

మధు :—పోనీయ్. అంతగా చికాకుపడుతుంటే ఆపడం యెందుకూ?

మనో :—ఔను! చికాకుగానేవుంది. మీ మాటలు నామనస్సును చీకాకుపరచాయి. వుండను. నిముషంకూడా వుండను. (త్వరత్వరిగా వెళ్తాడు)

మధు :—మీకేం భయంలేదు. అన్నీ నేనే చేస్తాను. వాణ్ని — ఆ భవానిగాణ్ని అడ్డం తొలగిస్తాను. ఆ బాధ్యతనాదే. ఇప్పుడేపోతున్నా. ఒరేయ్ నళినీ నీవుకూడా రా.

(మధు, నళినీ పోతారు. శ్యాందాస్ భయంగా చూస్తుంటాడు)

— తెర —

# మూడో అంకము

## ఒకటోరంగము

(కరువుక్యాంపు. రెండువరుసలుగా నిలబడివున్నారు ప్రజలు. తెరలోపాట వినిపిస్తూంది. వలంటీరు అన్నంముద్దలు పంచుతుంటాడు. ఒక్కొక్కరే ముద్ద తీసుకుని దూరంగాపోయి కూర్చుని తింటుంటారు. ఉషవస్తుంది. అప్పటికి ముద్దలు అయిపోతాయి. తింటున్నవాళ్ళ నందర్నీ చూసి, ఎవర్నో గుర్తించినట్లుగా త్వరత్వరగాపోయి ఎదురుగానుంచుని దీర్ఘంగా చూస్తుంటుంది. దుర్గాచరణ్ తలెత్తి చూస్తాడు.)

ప్రళయముబుట్టెను వంగదేశమున భయముగొలుప నోబాబా
భరతఖండమున పేరువహించిన పంటభూములివి బాబా॥
గంగ బ్రహ్మపుత్రల నీటితోనట కనకముపండును బాబా
అట్టిప్రాంతమున కరువుజ్వాలలు అలముకొన్నవో బాబా॥
పేదలెట్లు జీవింతురు ? వందట బియ్యపుబస్తా బాబా
ఆలిపిల్లలతో కలకత్తాలో అన్నమన్నమని బాబా॥
పేదలు చచ్చుచునుండిరి పట్టెడు సాదము దొరకక బాబా
పగలువత్తిడిని చీకటిపోకడ పాపము రాత్రియె బాబా॥
దారులుదీరిచి పండిరి పేదలు బజారులందే బాబా
ఆ గతి పడిగాపులు పడియుండిన అన్నార్తులలో బాబా॥
తెల్లవారి మరి లేవకెందరో చెల్లిరచ్చటే బాబా
సోషవచ్చి పడియున్న తల్లిపై సుతుడుచేరి ఓబాబా॥
పాలమ్మా యని భోరుననేడ్చుచు బాధించును ఓబాబా
కుక్కతొబాలుడు యెంగిలాకుకై కొట్లాడగనోబాబా॥
కుక్క పైనబడి కరువగ నాతండక్కడెకూలెను బాబా
పల్లెలలోపల బ్రతుకుకష్టమై ప్రజలనేకులో బాబా॥
కలకత్తాలో కూలిజేసికొన కదిలిపోయి ఓ బాబా
ఆలిపిల్లలతో జచ్చుచునుండిరి అందరచ్చటే బాబా॥

పైగా నెత్తిన బాంబులవర్షము పానిస్టులవో బాబా
నీ సోదరులిటు జచ్చుచుండగా నీవుజూతువా బాబా॥

నీ ఖర్చులకై పోగామిగిలిన నిలవధాన్యమో బాబా
ఆపదలోనున్నట్టి దీనులకు అంచచేయవా బాబా॥

పోళ్ళు బీళ్ళు దున్నేసి ధాన్యమును పుట్లకొలది ఓ బాబా
పండించుము రాత్రి బగలనక పంటలధికముగ బాబా॥

ఉష :—నాన్నా! నాక్కూడా కొంచెం పెట్టవూ?

దుర్గా :—ఎవర్నువ్వు?

ఉష :—నన్నెరగవూ? నీ ముద్దుబిడ్డ ఉషనుగానూ.

దుర్గా :—నాకేంతెలియదు. నాకెవ్వరూ పిల్లల్లేరు. అందర్నీ కరువు మ్రింగేసింది. నేనొక్కణ్నే మిగిలాను.

ఉష :—కాదు నాన్నా! కాదు. నన్నెంతో ముద్దుగా పెంచావు. నాపై ఎన్నో ఆశలుపెట్టుకొని బ్రతుకుతున్నావని చెప్పావు. అన్నీ జ్ఞాపకంవున్నాయి. అప్పుడే మరచిపోయ్యావా?

దుర్గా :—నాముద్దలో భాగంకోసం ఎత్తువేస్తున్నావు. ఒక్క మెతుకూ్కూడా యివ్వను. ఈముద్ద మళ్ళీ నాలుగురోజులదాకా దొరకదు. అప్పుడప్పుడూ కాస్తకాస్త గంజి దొరుకుతుంది. ఇందులో భాగం ప్రాణంపోయినా యివ్వను. (త్వర త్వరగా తింటుంటాడు)

ఉష :—ఎంతో ప్రేమతో పెంచావు. ఈనాడొక్క మెతుకూ్కూడా పెట్టనంటున్నావు. కన్నబిడ్డల్ని దిక్కులేకుండా వదిలావు. చావు మంచంపైవున్న భార్యను మరచావు. నీ బ్రతుకు చూచుకున్నావు. నీకు హృదయంలేదు. కసాయి వాడిలా మాట్లాడుతున్నావు.

దుర్గా :—నాబిడ్డ పచ్చగావుండేది. నీవింత నల్లబడ్డావేం! వంటినిండా అలా మచ్చలున్నాయేం!! ఛీ! ఛీ!! నాబిడ్డవుకాదు. బొంకుతున్నావు.

ఉష :—నీవు పోయింతరువాత అమ్మపోయింది. అక్కను మధుగాడవమానం చేయబోయాడు. నాకావూళ్లో వుండటం భయంగా కనుపించింది. ఒకరాత్రి లేచాను, ఇల్లు విడిచాను. ఎన్నో అవమానాలు పొందాను. చివరకిలా

తయారయాను. అయినా బ్రతికున్నాను. నరకయాతన లనుభవిస్తున్నా. భవానన్నయ్య చెప్పినట్లింటే నాకీగతి పట్టేది కాదనిపిస్తుంది. నా అమాయ కత్వం నన్నీస్థితికి తీసుకొచ్చింది.

దుర్గా :—రా అమ్మా! దగ్గరకు రా. కూర్చో. నావంక చూడు.

ఉష :—చూడు. తనివితీరా చూడు. ఆకలితో చావలేక శరీరాన్నమ్మి జీవించిన నీ బిడ్డనుచూడు. కుళ్ళిపోయిన నరాలతోవుంది, ఆనాటి నీబిడ్డకాదు. పత నమై కుటుంబానికే కళంకంగావుంది కదూ!

దుర్గా :—ఔను! గుర్తుకువచ్చింది. (దగ్గిరకు తీస్తాడు)

ఉష :—నన్నంటుకోకు. నాజీవితాన్ని చూడు. నాకీస్థితెలా వచ్చిందో ఆలోచించు. నన్నీభయంకర నరకంలోకి నెట్టిన పరిస్థితులేవో గ్రహించు. నాచావు దగ్గర కొచ్చింది. నా ఆఖరు ఘడియల్లో నిన్ను చూడగల్గాను. చాలు.

దుర్గా :—ఏమిటీ? అవమానాలు పొందావు. అభిమానాన్నమ్మావు. కుటుంబ గౌరవం కళంకపరచావు. బ్రతికున్నావు. తూ. తూ.

ఉష :—బ్రతికున్నాను. చావకుండా మిగిలున్నాను. కరువుకు మాపురూపంగా నిల్చాను.

దుర్గా :—చావు. నాకుదూరంగా పోయిచావు. నీ నీచజీవితం వినిపించి నన్నేడ్పిం చకు. పో. దూరంగా వెళ్ళిపో.

ఉష :—నే నెన్నిరాత్రులు నా జీవితాన్ని తలచుకొని యేడ్చానో నీకేంతెల్సు. ఆందులో అణుమాత్రంకూడా నీ వనుభవించి వుండవు. ఇప్పుడనుభవించు.

దుర్గా :—నన్ను వేధించకు. దూరంగావెళ్ళు.

ఉష :—వెళ్ళను. నీ ఎదుటగానే వుంటాను. నాబాధను చూపిస్తాను.

దుర్గా :—పో. అవతలకుపో. (కాలితో తంతాడు. ఆతాపుకు అబ్బా! అంటూ ఉష పడిపోతుంది. దుర్గాచరణ్ దగ్గరగా వెళ్తాడు) ఉషా! ఉషా!!........ పలుకవూ! పెద్దగా యేడుస్తాడు. మధ్యమధ్య ఉషా! ఉషా! అంటూ పలవరిస్తుంటాడు.)

తెర —

# రెండోరంగము

(అహారకమిటీ. ఆఫీసుగదిలో భవాని. ప్రతిమా కూర్చుంటారు)

ప్రతిమ :—చారుదత్ అల్లరి అంతులేకుండా పెరిగిపోతూంది. యేవీధికి పోతే ఆ వీధికి వస్తున్నాడు. నాపనికన్నీ ఆటంకాలు కల్పిస్తున్నాడు.

భవాని :—వారు సిగ్గులేకుండా ప్రవర్తిస్తున్నారు. అదీగాకుండా మధుబోస్ రెచ్చగొట్టి చేయిస్తున్నాడు.

ప్రతిమ :—అప్పుడప్పుడూ మధూ చారుదత్ యిద్దరూ కనిపిస్తారు. కూడులేక ఈ ప్రచారం చేస్తుందని పెద్దగా అంటారు. నాకు కోపంరావడానికి యింకా ఎన్నో మాటలు అంటున్నారు.

భవాని :—అననియ్. వాళ్ళే అనుభవిస్తారు. నీపని నీవు చేసుకొస్తూండు.

ప్రతిమ :—ఉష ఎవరితోనో లేచిపోయిందనీ; తండ్రి దేశాలపాలయినాడనీ, ఇంకా సిగ్గులేకుండా దేశసేవంటూ తిరుగుతుందనీ, అంటున్నారు. నేనామాటలు వినలేకుండా వున్నాను. ఎంతో కోపంవస్తుంది. లాగి చెంపపగులగొట్టాలని పిస్తుంది.

భవానీ :— వాళ్ళకు రోజులు దగ్గరకొచ్చాయిలే. నీవేం జంకకు. అనవసరంగా కోపం తెప్పించాలని చూస్తే తలెత్తిచూడకుండా వెళ్ళిపో. అంతకూ విడవకుండా వెంబడిస్తే బుద్ధిచెప్పు వెధవలకు.

ప్రతిమ :—ఇవాళ వెంటబడ్డారు. ఇన్నేళ్ళొచ్చినా పెళ్ళిచేసుకోకుండా తిరుగుతుందనీ, దానింకేం సిగ్గు చిన్నప్పుడే విడిచిందనీ వాగారు. అప్పుడే బుద్ధి చెప్పాలనుకున్నాను. కాని మళ్ళీ నిన్నడిగి చేద్దాం అనిపించి ఆగాను.

భవాని :—అయితే ఒక్కదానివే వెళ్ళకు. ఆఫీసునుంచెవర్నయినా వెంట తీసుకుపోతూండు.

ప్రతిమ :—అలాగేచేస్తాను.

(వలంటీరు వస్తాడు)

వలం :—పడమటివీధిలో ధాన్యంవున్నచోటు తెల్సిందని వార్త వచ్చింది.

భవాని :—అయితే రహీంకుకూడా కబురుపంపండి. నేనిప్పుడే పోతున్నాను.

(వలంటీరు వెళ్తాడు)

ప్రతిమ :—నేనుకూడా వస్తాను. చీకటిగావుంది. ఒక్కడివే పోతున్నావు.

భవాని :—నీవొద్దమ్మా! అసలు వాళ్ళంతా అసహ్యంగా ప్రవర్తిస్తున్నారు. అక్కడకినేనొక్కడ్నీ పోవడంలా. రహింకూడా వస్తాడు.

ప్రతిమ :—నేనువస్తాను. ఒక్కదాన్నీ యిక్కడవుండను.

భవాని :—సరే పద. నీవెప్పుడూ అంతే.

(యిద్దరూ బయటికి పోతారు)

— తెర —

## మూడోరంగము

(కరువుక్యాంపుకు ప్రక్కగా మధుబోస్, చారుదత్తు, నళినీ మంచునుంటారు)

మధు :—నళినీ! చూడ్రా – లోపలున్నాడేమో!

చారుదత్తు :—బయటికొస్తాళ్ళేరా.

నళిని :—ఔను! చారుదత్తు చెప్పిందే బాగుంది. ప్రక్కగానేవున్నాం. కటికచీకటిగావుంది. బైటకువస్తూనే పని పూర్తిచేదాం.

మధు :—మీవద్ద కత్తులు భద్రంగావున్నాయా?

చారుదత్తు :—నావద్ద భద్రంగానేవుంది.

నళిని :—నాకత్తి మా అమ్మాయి తీసుకు నాదుకుంటుంది. అది తీసుకోబోతూంటే ఒక్కతీరునే యేడ్వడం సాగించింది. యింకేం. మా ఆవిడ వుంచిపొమ్మని ఆదేపనిగా అడిగింది. యేంచెప్పి తీసుకురావాలో తోచక విడిచివచ్చాను.

మధు :—ఛీ! ఛీ!! వెధవపనిచేశావు. ఒకవేళ పట్టుకో ప్రయత్నిస్తే ఎలా పారిపోతావు. చేతిలో కత్తన్నా వున్నట్లయితే చూపించి భయపెట్టి పారిపోవచ్చు చాలా తెలివితక్కువపని చేశావు.

నళిని :—యేంచెయ్యను? పోయి తెచ్చుకోనా?

మధు :—ఇంకా యిప్పుడేం తెచ్చుకుంటావులే. నావెంటే వుండు. అదిగో ఆవీధి నుంచేదో చప్పుడు వినిపిస్తుంది. చూడు. అలా కొంచెం తొంగిచూడు.

చారుదత్తు :—అంతా చీకటిగావుంది. యేమీ కనుపించడంలా.

నళిని :—మాటలు వినిపిస్తున్నాయి. భవాని, ప్రతిమల్లాగున్నారు. కాచుక్కూర్చోండి.

చారుదత్తు :—ప్రతిమ నావంతు.

మధు :—భవాని నావంతు.

నళిని :—నావంతో—

మధు :—ఎవరన్నా వస్తారేమో చూద్దం నీవంతు.

(భవానీ, ప్రతిమ దగ్గరగావస్తారు. మధుబోస్, చారదత్‌లు కత్తులతో నెమ్మదిగా పోతారు. మధుబోస్ కత్తితో భవానీని పొడుస్తాడు. భవానీ అబ్బాయని కూలబడతాడు. ప్రతిమ పెద్దగా అరుస్తుంది. చారదత్ మధుబోస్ నలినీరంజన్ పరుగు తీస్తారు. జనం గుంపులు గుంపులుగా వస్తారు)

ప్రతిమ :—పట్టుకోండి. మధు, చారుదత్తులు భవాన్ని కత్తితో పొడిచి పారిపోతున్నారు. పట్టుకోండి.

(హడావుడిగా తలొకవైపుగా ప్రజలు పరుగెత్తుతారు)

— తెర —

## నాల్గోరంగము

(ఆహారకమిటీ ఆఫీసు ఆవరణలో చాపమీద భవాని బాధతో మూల్గుతుంటాడు. ప్రతిమ ప్రక్కనే విచారంగా కూర్చునివుంటుంది. ప్రజలు నిలబడి చూస్తుంటారు. రహీం, మనోరంజన్ కొందరు వలంటీర్లు. శ్యాందాస్‌నీ చారదత్‌నీ. నళిని రంజన్‌నీ పట్టుకువస్తారు.)

రహీం :—ధాన్యం పట్టుకున్నాం. ఇంతలో కేకలు వినిపించాయి. ఏమిటా అని ఆలోచిస్తున్నాం. నిన్ను దొంగచాటుగా కత్తితో పొడిచి పారిపొయ్యారని తెల్సింది. ఒక్క గంతుతో లేచాను. అంతులేని వేగంతో పరుగెత్తాను. వీళ్ళిద్దరూ దొరికారు. మధుబోస్ దొరకలా. వీళ్ళద్వారానే శ్యాందాస్ సంబంధం కూడా తెల్సుకున్నాం. ధాన్యం క్యాంపుకు పంపి వీళ్ళను నీవద్దకు తెచ్చాం.

మనో :—జాతీయత పేరుతో నన్ను వంచించారు. నీవు దేశద్రోహివని కూడా ప్రచారం చేయించారు. నీపై ఎన్నోనిందలు వేయించారు. ప్రభుత్వసహాయం తోనే పనిచేస్తున్నానని చెప్పారు. కాని, నెమ్మది నెమ్మదిగా అన్నీ తెల్సుకున్నాను. నీ నిరంతరకృషితో నిర్మించిన గ్రామ ప్రజాఐక్యతను కళ్ళార జూచాను. అంతా అర్థంచేసుకున్నాను. ఈరోజునుంచీ నీమార్గాన నడుస్తానని శపథం చేస్తున్నాను.

శ్యామ్ :—మధుబోసే నాచేతివన్నీ చేయించాడు. అంతా తెల్సింది. నేదాచిన ధాన్యాన్నీ, నా ధనాన్నీ కరువుసమస్యా పరిష్కారానికి వినియోగిస్తాను. నా తప్పులు క్షమించండు. నీకు ప్రతికూలంగా ఎన్నెన్నో ఘోరాలు చేయించాను. ఆఖరుకు నీవే జయించావు. నీ మార్గంలోనే ప్రజాశ్రేయస్సుంది.

నళిని :— బుద్ధి గడ్డితిని చేశాను. నాకేం లాభంలేదు. వచ్చినలాభమంతా శ్యామ్ దాసుకే దక్కింది. నాక్కాస్తకూడా భాగంయివ్వలా. పైగా మీముందంతా త్యాగం చేస్తానని చెప్తున్నాడు.

(మధుబోస్‌ను కూడా వలంటీర్లు పట్టుకువస్తారు. అంతా తలోదెబ్బా కొడతారు. సిగ్గుతో తలవంచుకొని వుంటాడు.)

ప్రతిమ :—అన్నయ్యా! నా జీవితాన్నెంతోదిద్దావు. నన్నొకమనిషిని చేశావు. నన్నెంతో ప్రేమతోచూశావు. ఆఖరి నిముషాలు లెక్కిస్తున్నావు. నీబాధ్యతను మా అందరిపైనా విడిచి పోతున్నావు. స్వాతంత్రపోరాటంలో నీవు నేర్పిన త్యాగం, కరువుపరిష్కారకృషితో నీవుసాధించిన గ్రామైక్యత మ. కార్యోత్సాహుల్ని చేస్తుంది. అయినా పోతున్నావు. నీవు మమ్మల్ని విడిచి పోబోతున్నావు కనుపించవు. నీవిక మాకు కనుపించవు. కాని, నీ సందేశం మాచెవుల్లో ప్రతిధ్వనిస్తుంది. నీబాటనే నడుస్తాం. నీ ఆశయాన్ని సాధిస్తాం.

భవాని :—(బలవంతంగా కళ్లు తెరచి అందరివైపు చూస్తాడు) పోతున్నాను. పోతున్నాను. నా బాధ్యతకూడా మీమీదే వుంచి తుపోన్నాను. ప్రజలను ఎలా రక్షిస్తారో మీ.... దే.... బా.... ధ్య.... త........ మీ.... దే........

మనో :—ప్రజల్ని రక్షిస్తాం. ఒక్యతను నిర్మించి స్వాతంత్ర్యాన్ని సాధిస్తాం.

భవాని :—అ........బ్బా........(కళ్లుమూసుకు పోతాయి)

(అందరు విచారంతో తలలు వంచుతారు తెరలో పాట వినుపించుతుంది)

కాంగ్రెస్-లీగులు కలవాలి - భారత - స్వాతంత్ర్యముకై పోరాలి
బంకిం. సి. ఆర్. దాస్ రవీంద్రులు. పుట్టిన వీరగడ్డలోపల
క్షామపీడితులు లక్షలాదిగా. చావకుండగనె సంరక్షింప ॥కాం॥

జాతీయోద్యమ జన్మభూమియౌ, వంగరాష్ట్రమున వందలు. వేలు
కుటుంబాలు మటుమాయమవ్వకను, కూడు గుడ్డలు మందులు బంప ॥కాం॥

అన్నమోయని అలమటించెడి. నిలువునీడకై పలవరించెడి
తల్లీ పిల్లలదరిజేర్చంగా, భార్యాభర్తల సమకూర్చంగా ॥కాం॥

కలరా, మశూచి, అంటుజాడ్యముతో, కృంగి కృశించి నశించెవారికి
ఓపిన సాయముతో బెంగాలును. కాపాడంగా భారతభూమిని ॥కాం॥

మందుటాకలిని భరించలేక, రెండురూకలకు శిశువు నమ్ముట
పడుపువృత్తికి భార్యనంపుట, పడుబాధల కడు వేగదీర్చగా ॥కాం॥

వంగరాష్ట్రమున సర్వవ్యాప్తమై. ఒరిస్సా కేరళ రాయలసీమలో
వ్యాపిస్తున్న కరుపిశాచిని, ఆపియు ప్రజలను సంరక్షింప ॥కాం॥

కాంగ్రెస్ సంస్థ ఆశయమేదో, గాంధీ నెహ్రూ కోరినదేదో
అట్టికరువును తీర్చివేగమె. గట్టిగాను పనిజేయగనేడే ॥కాం॥

ఐక్యతతో ప్రజలందరమొకటై ఆకలిమంటల నార్పియువేగ
ఫాసిజంబును రూపుమాపియు, పరతంత్రమును పారద్రోలగ ॥కాం॥

దేశనాయకుల విడుదలకొరకై, దీక్షదక్షత చూపించంగా
జాతీయప్రభుత్వ స్థాపనజేయ, జాతీయైక్యతె సాధనంబని ॥కాం॥

స్వతంత్రభారత పిలుపునందుకుని. సత్వరంబుగా సాగిపోవగా
దేశరక్షణా దీక్షనుబూని. విజయసాధనకు వేవేగంబే ॥కాం॥



